వేమన కవిత్వం స్వచ్ఛమైన చెలమ. శైలిలో, భావనలో స్వతంత్రమైనది. అప్రయత్నంగా పెల్లుబికేది. పాదత్రయంలోనే పద్యసారాన్నంత ఇముడ్చుతాడు. సంక్షిప్తత వ్యంగ్యానికి హృదయమయితే ప్రపంచంలో ఇంతకుమించిన వ్యంగ్యం లేదు. అతని ఉత్ప్రేక్షలు ఉపమానాలు అన్నీ పల్లె దృశ్యాలనుండి, గ్రామీణ వాతావరణం నుండి పొలాల నుండి, వనాల నుండి గ్రహింపబడ్డాయి. వేమన ప్రకృతికవి; సహజకవి కూడ.

**– ఆచార్య కట్టమంచి రామలింగారెడ్డి (1950)**

(తొలి ఉప కులపతి, ఆంధ్ర విశ్వవిద్యాలయం)

వేమన కవిత్వం ప్రశాంతవాతావరణంలో నెమరు వేసుకున్న భావాలు కావు. భావోద్వేగం పొంగి పొదవిన గడియలలో ఆవిర్భవించిన కవిత వేమనది. విశ్వాసాలకు అంకితమైనవాడు. కనుక వేమన తన భావావేశాన్ని అణగారనిచ్చేవాడు కాదు. కర్తవ్య నిర్వహణలో తన పాత్ర కవిపాత్ర కాదని, ఒక దార్శనికుని పాత్ర అని వేమన నిర్ణయించుకొన్నాడు. అందువల్ల వేమన కవిత్వ లక్షణాలకు ప్రాధాన్యత నీయలేదు ... వేమనది ఉదాత్త కవిత్వం. అందుచేత వేమన కవిత్వం ఒకప్పుడు వరదలా ఉప్పొంగుతుంది. అగ్నిపర్వతంలా బ్రద్దలవుతుంది; తుఫానులా సముద్రాలను సుళ్లు త్రిప్పుతుంది. మరొకప్పుడు మండు వేసవి తరువాతి చల్లని జల్లులా, మలయమారుతంలా, ఉషోదయపు పక్షుల కలకూజితంలా అతి త్వరితగతిని మారుతుంటుంది.

**– నార్ల వెంకటేశ్వర రావు (1989)**

(మాజీ సంపాదకులు, ఆంధ్రజ్యోతి)

తెలుగు సాహిత్యములో ఈ కవిస్థానము, గ్రీకు సాహిత్యములో లూషియన్ స్థానము వంటిదే. వేమనసూక్తులు గ్రీకువేదాంతి ప్లేటో మతనిబంధనకు సన్నిహితము లగుచుండ ఆయన నైతికనియమావళి డెమోక్రిటస్ సాంప్రదాయిక సూత్రములను బోలియున్నవి. ర్యాబెలె వలెనే కపట యోగులను, వేషధారులను ఒక ప్రత్యేక గర్హణముతో చూచినాడు.

**- C.P. Brown (1840)**

లోక కవులలో వేమన ఒక్కడే మహాకవి. సామాన్య మత దేవతాగణ మనిన వేమనకు చులకన దప్ప వేరొండు భావము కలుగదు. ఈ దేవత లున్నట్లు అంగీకరించి వారు పరి మిత జీవులేగాని, అమరులు గారని, మనుజుల వలెనే నీచోద్వేగములు, రాగములచే ప్రోత్సాహపరుపబడి దుష్కార్యములు జేసినారని వేమన అభియోగము. అగోచరుడు, నిర్వికారుడు, అపరివర్తనుడైన ఆ పరమపురుషు డొక్కడే సర్వ జీవకోటికి ప్రాణదాత అని, సర్వదృశ్యజగత్తుకు మూలమై, అంతర్గతమైన పరమ సత్యమే ఆ విరాట్పురుషుడని, సర్వవ్యాపి పరమగమ్యుడు అయిన ఆ పరమాత్మ యందే మానసము లగ్నము చేయవలెనని వేమన అభిప్రాయం.

**- W.H. Campbell (1898)**

వేమన ఆంధ్రులలో సాటిలేని వ్యక్తి. అతీంద్రియములైన తత్వములను తెలిసికొన వలెనను ఆశ, వానిననుభవ పూర్వకముగా సాధించు సాహసము, తనకు తెలిసిన వానిని నిర్భయముగా ప్రపంచమునకు బోధించు ధైర్యము, దానికి సాధనమై యిరు ప్రక్కలందును మరుగులేని మంచి పదనుగల చురకత్తి వంటి కవితా శక్తి. దానికి మెరుగిచ్చునట్టి సంకేత దూషితముకాని ప్రపంచ వ్యవహారములందలి సూక్ష్మదృష్టి గాయపుమందు కత్తికే పూసికొట్టినట్లు తిట్టుచునే నవ్వించు హాస్య కుశలత, ఇవన్నియు వేమన్నను సృష్టి చేయునపుడు బ్రహ్మదేవుడుపయోగించిన మూల ద్రవ్యములు.

– ఆచార్య రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

వేమన పద్యాలకు వ్యాఖ్యానం అవసరం లేదు. కాని సరళ సుందరమైన వేమన పద్యాల్లోకూడా ఆలోచిస్తే గాని తట్టని అర్థాలు బోలెడన్ని కనిపిస్తాయి.

– ఆచార్య గోపి

తెలుగు సాహిత్యంలో మహాకవులు ముగ్గురే – తిక్కన, వేమన, గురజాడ. – శ్రీశ్రీ

సమాజంలోని మనిషి వివేచన ఎలా ఉండాలో, వివేకం ఎలా పనిచేయాలో మనిషికి ఎలాంటి విలువలు ఇవ్వాలో, కులమతాలకు ప్రాంతాలకు అతీతంగా మనిషి తన్నుతాను ఎలా ఉద్ధరించుకోవాలో తెలుగువారికి తెలియచెప్పిన కవి వేమన.

– ఆచార్య ఆర్.వి.యస్. సుందరం

వేమన పద్యములలో గల సొంపైన నడకను, భాషలోని తియ్యదనమును ఏ వ్రాతగానికి గాని అబ్బలేదు. ఎవరూ మించలేదు. - **Mac Donald (1866)**

వేమన తెలుగు కవులందరిలోను ఎక్కువ ప్రజాభిమానము పొందినవాడు. ఇప్పుడు వాడుకలో నున్న ఏ చాటువకు గాని, సామెతకు గాని, అర్థపూర్ణమైన నీతిసూత్రమునకు గాని వేమన కర్తృత్వము అంటకట్టబడనిదే లేదు. ఆయన కవితాసౌభాగ్యము రచనాశక్తుల వల్లనేగాక, మానవాళిపై ఆయన చల్లిన ప్రేమ రసము వల్లను సర్వప్రపంచ హృదయమును లోబరచుకోగలడు. ఆయన కోపము, నింద, అవహేళనము, అసూయా ప్రేరకములు గావు. పొరపాటుపడుచున్న మానవుల ధోరణి పట్ల ఆయనకు కలిగిన ఆవేదనే ఈ రూపమున బయటపడినది. ఈ భూమిలో తల ఎత్తుకొని తిరిగి స్వతంత్రముగ మనవలయు ననియే ఆయన వాంఛ. మానవ స్వాతంత్ర్యము, సమానత్వము, ప్రతిష్ఠను ఆకాంక్షించే ప్రపంచ దార్శనిక మహా కవులలో వేమన సర్వోత్తముడు.

- **Sir Greevson (1903)**

ఇవి నిజంగా సువర్ణాక్షరములు. ఇవి మతావరణములో బుట్టిన సత్యములు గావు. శ్రామిక అకళంక ప్రజల ప్రేమ పూర్ణ హృదయ కుహరములనుండి వెలికుబికిన శాశ్వత సత్యములగుటచే పరమోత్కృష్టము లగుచున్నవి.

- **David Barnet (1908)**

# వేమన పద్యాలు

సేకరణ - భావం

**కట్టా నరసింహులు**

సంపాదకులు

**ఆచార్య జి. శివారెడ్డి**

ప్రచురణ

**రెడ్డి సేవా సమితి**

**కడప - 516 004.**

స్ఫూర్తి

**వందేమాతరం ఫౌండేషన్**

# వేమన పద్యాలు

ప్రథమ ముద్రణ : **అక్టోబరు 2007**
ప్రతులు : **2,000**

ద్వితీయ ముద్రణ : **మే 2008**
ప్రతులు : **5,000**

తృతీయ ముద్రణ : **జూన్ 2011**
ప్రతులు : **42,000**

వెల : **రు. 5-00**

ప్రతులకు :

**రెడ్డి సేవా సమితి,**
రాజీవ్ మార్గ్, ఎర్రముక్క పల్లె,
కడప - 516 004.
ఫోన్ : 08562-257729
సెల్ : 9440297700
9440651284

**వందేమాతరం ఫౌండేషన్**
1-8-522/7,
చిక్కడపల్లి, హైద్రాబాద్ - 500020.
ఫోన్ : 040-27678282
సెల్ : 94407 88282
98490 54339

అక్షర విన్యాసం మరియు ముద్రణ :

**కొండూరు జనార్దన రాజు**
ఆర్.కె. గ్రాఫిక్స్ & స్క్రీన్స్,
మునిరావు వీధి, కడప - 516 001.
సెల్ : 9849197044

# విశ్వదాభిరామం

శ్రుతులు, స్మృతులు, పురాణాలు, ఇతిహాసాదులే కాదు, వేమన పద్యాలు కూడా సమాజానికి దిశానిర్దేశం చేయగలవు. జనం నోళ్లలోను, తాళపత్రాల లోను పరిమితమైన ఆ పద్యాలను సి.పి. బ్రౌన్ మహాశయుడు తొలిసారిగా అచ్చువేయించాడు. ఆయన పుణ్యాన ఈ పద్యాలు ఇతర భాషల్లోకి, విదేశాలకీ ప్రాకిపోయాయి.సమాజానికి వెలుగు బాటలు దిద్దుతున్నాయి.

జీవిత పరమార్థాన్ని ప్రబోధించిన వేమన పద్యాలు మానవతకు మార్గదర్శనం చేశాయి. తెలుగు భాషకు పడుతున్న గ్రహణం కారణంగా పద్యాల ప్రాచుర్యం నేడు తగ్గింది. దీనితో సమాజంలో అనైతికత, వ్యక్తిత్వ హీనత చోటుచేసుకున్నాయి. జీవితంలో ఎదురయ్యే అనేక సామాజిక, వ్యక్తిగత సమస్యలెన్నింటికో దివ్య ఔషధాలుగా ఉపకరించాయి.

సమాజాన్ని ఎప్పటికప్పుడు సంస్కరించాలన్నది పెద్దల మాట. నేటి తరం బాల బాలికల మదిలో ఉత్తమ భావజాలం ముద్రపడితే భవిష్యత్ సమాజం సంస్కారంతో సమున్నతంగా ముందుకు సాగుతుంది. ఇందుకోసం వందేమాతరం ఫౌండేషన్ ప్రభుత్వ పాఠశాలల్లో చదివే వేలాదిమంది విద్యార్థులకు ఉద్యమస్థాయిలో వేమన పద్యాలను పునర్ వ్యాప్తం చేయాలని సంకల్పించి సంస్కరణకు శ్రీకారం చుట్టింది.

చిన్నారులకే కాక పెద్దవాళ్ల దాకా అందరికీ అందుబాటులో ఉండాలన్న ఆకాంక్షతో ఏర్చి కూర్చి కొన్ని పద్యాలను ముద్రించాం. నామమాత్రపు వెలతో అందిస్తున్నాం. వేమన పద్యాలు ఇంటింటా ప్రచారం కావాలన్నదే మా ఆశయం. సమాజాన్ని చైతన్యం పరచాలనే తలపే ఈ ప్రచురణకు ప్రేరణ.

ఈ పద్యాలను సేకరించి భావం వ్రాసి ముద్రణకు సహకరించిన ఆత్మీయులు **కట్టా నరసింహులు** గారికి, పద్యాలకు అకారాది క్రమణికను కూర్చిన **సి.శివారెడ్డి,** తంగేడుపల్లె గారికి, ముచ్చటగా ముద్రించి యిచ్చిన **కొండూరు జనార్దన రాజు** గారికి కృతజ్ఞతలు. **వందేమాతరం ఫౌండేషన్** అభ్యర్థనను మన్నించి 114 పద్యాలకు భావాలతో ఈ తృతీయ ప్రచురణ చేశాం.

**ఆచార్య జి. శివారెడ్డి**
రెడ్డి సేవా సమితి, కడప.

# వేమన పద్యాలు

1. **అంతరంగమందు అపరాధములు జేసి**
**మంచివాని వలెను మనుజు డుండు**
**ఇతరు లెరుగకున్న ఈశ్వరు డెరుగడా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పైకి మంచివాడుగా నటిస్తూ మనస్సులో చెడుగా ఆలోచించే మనిషిని గురించి యితరులకు తెలియక పోవచ్చుగాని, దేవుడికి తెలియకుండా ఉంటుందా?

2. **అంతరంగమందు అభవు నుద్దేశించి**
**నిలిపి చూడచూడ నిలుచుగాక**
**బాహ్యమందు శివుని భావింప నిలుచునా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పరమాత్మను హృదయంలో నిలుపుకొని చూస్తే గురి కుదురుతుంది. బాహ్యంలో చూస్తే గురి కుదరదు. ఫలితం శూన్యం.

3. **అడవి దిరుగ జిక్క దాకసమునలేదు**
**అవని తీర్థయాత్రలందు లేదు**
**ఒడలు శుద్ధిచేసి ఒడయని చూడరా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

అడవిలో తిరిగినా, ఆకాశంలో చూచినా, తీర్థయాత్రలు చేసినా శివుడు దొరకడు. శరీరాన్ని మనస్సును శుద్ధిచేసి అందులోనే పరమాత్మను చూడాలి.

4. **అదిమి మనసు నిలిపి ఆనందకేళిలో**
**బ్రహ్మమయుడు ముక్తి బడయగోరు**
**జిహ్వారుచులచేత జీవుండు చెడునయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

మనస్సును నిలకడగా నిలిపి ఆనందపరవశుడై బ్రహ్మజ్ఞాని ముక్తిని కోరుకుంటాడు. ఇంద్రియాలకు వశుడై మనస్సును నిలబెట్టుకోలేక పోవడం వలన మనిషి చెడిపోతాడు.

5. **అనగ ననగ రాగ మతిశయిల్లుచు నుండు**
**తినగ తినగ వేము తీయ నుండు**
**సాధనమున పనులు సమకూరు ధరలోన**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పాడుతూ పాడుతూ ఉంటే రాగం మెరుగ్గా వస్తుంది. తింటూ తింటూ ఉంటే వేప కూడా తీయగా అనిపిస్తుంది. సాధన వల్ల పనులు సాధ్యపడుతాయి.

6. **అనువుగాని చోట అధికుల మనరాదు**
**కొంచె ముండు టెల్ల కొదువ గాదు**
**కొండ అద్దమందు కొంచెమై యుండదా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

వీలుకానిచోట గొప్పవాళ్ళం అని చెప్పుకోకూడదు. అక్కడ చిన్నతనం వచ్చినా అవమానమయిందని భావించనక్కర లేదు. పెద్దదైన కొండ అద్దంలో కొంచెంగానే కనిపిస్తుంది గదా!

7. **అన్నిదానములను అన్నదానమె గొప్ప**
**కన్నవారి కంటె ఘనులు లేరు**
**ఎన్న గురువు కంటె ఎక్కువ లేరయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

దానాలలోకెల్ల అన్నదానం గొప్పది. తల్లిదండ్రుల కంటె గొప్పవారు లేరు. అలాగే గురువును మించిన వారెవరూ లేరు.

8. **అప్పు దీయరోత హరిహరాదులకైన**
**మొప్పెతోడ మైత్రి మొదలె రోత**
**తప్పు బలుకరోత తాకట్టిడిన రోత**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

హరిహరాదులకు కూడ అప్పు చేయడం రోత. తప్పు మాట్లాడ్డం రోత. తాకట్టు పెట్టడం రోత.

**9.** **అప్పులేని వాడె అధిక సంపన్నుడు**
**తప్పులేని వాడు ధరను లేడు**
**గొప్పలేని బుద్ధి కొంచెమై పోవురా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

అప్పుచేయనివాడె గొప్ప సంపదగలవాడు. తప్పుచేయని వాడు లోకంలో లేడు. అలాగే గొప్పతనం లేని తెలివి కొంచెమై పోతుంది.

**10.** **అల్పబుద్ధి వాని కధికార మిచ్చిన**
**దొడ్డవారి నెల్ల తొలగ గొట్టు**
**చెప్పుదిన్న కుక్క చెరకు తీపెరుగునా?**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

నీచునికి అధికారమిస్తే గొప్పవాళ్ళని తొలగిస్తాడు. చెప్పు రుచి మరిగిన కుక్కకు చెరకు తీపి రుచించదు గదా!

**11.** **అల్పసుఖము లెల్ల నాశించి మనుజుండు,**
**బహుళదుఃఖములను బాధపడును**
**పరసుఖంబు నొంది బ్రతుకంగ నేరడు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఐహిక (ఈ లోక) సంబంధమైన అల్పసుఖాలకు ఆశపడడంవల్ల అవి దుఃఖాన్ని కలుగచేస్తాయి; బాధనుండి విముక్తిని కలుగచేయలేవు. పరసుఖాన్ని ఆశించడంవల్ల బాధా విముక్తుడవుతాడు. ఇది జీవిత పరమార్థమని తెలుసుకోలేక పోతున్నాడు.

**12.** **అల్పు డెపుడు పల్కు ఆడంబరము గాను**
**సజ్జనుండు పల్కు చల్లగాను**
**కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

నీచుడు డాంబికంగా మాట్లాడుతూ ఉంటాడు. సజ్జనుడు ప్రశాంతంగా మెల్లగా మాట్లాడుతాడు. కంచుమోగినట్లు బంగారు మోగదు కదా!

**13.** **ఆత్మలోన శివుని అనువుగా శోధించి**
**నిశ్చలముగ భక్తి నిలిపె నేని**
**సర్వముక్తుడౌను సర్వంబు తానౌను**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

శరీరాన్ని మనస్సును నిశ్చలంగా యోగసిద్ధిలో నిలిపినపుడు మాత్రమే ముక్తి లభిస్తుంది. అందరిలో తనను, తనలో అందర్నీ చూడగలడు.

**14.** **ఆత్మశుద్ధి లేని ఆచార మదియేల**
**భాండ శుద్ధి లేని పాకమేల**
**చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఆత్మశుద్ధిలేని ఆచారాలు, కుండశుద్ధిలేని వంటకాలు ఎలా పనికిరావో చిత్తశుద్ధిలేని శివపూజలు కూడా ప్రయోజనం లేనివే!

**15.** **ఆలి వంకవార లాత్మ బంధువు లైరి**
**తల్లి వంకవారు తగినపాటి**
**తండ్రి వంకవారు దాయాదు లైరయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

భార్యవైపు వారు ఆత్మీయులౌతారు. తల్లివైపువారు అంతంత మాత్రమే. తండ్రివైపు వారు పగవారౌతారు.

**16.** **ఆలుసుతులు మాయ అన్నదమ్ములు మాయ**
**తల్లి తండ్రి మాయ తానుమాయ**
**తెలియ నీదు మాయ దీనిల్లు పాడాయ**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

తెలిసిన వారికి భార్యాపిల్లలు, అన్నదమ్ములు, తల్లిదండ్రులు, చివరికి తాను కూడా మాయే. ఈ శరీరం పాడుగాను, ఈ మాయ ఏమీ తెలుసుకోనీయదు.

**17.** **ఆశకన్న దుఃఖ మతిశయంబుగ లేదు**
**చూపు నిలుపకున్న సుఖములేదు**
**మనసు నిలుపకున్న మరి ముక్తి లేదయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఆశ కంటే దుఃఖం వేరే లేదు. చూపు నిలిపితే సుఖం లభిస్తుంది. మనసు నిలిపితే ముక్తి లభిస్తుంది. అంటే మనస్సులోని కోరికలు అదుపులో ఉంచకుండా ముక్తి దొరకదు.

**18.** **ఆశచేత మనుజులాయువు గలనాళ్లు**
**తిరుగుచుందురు భ్రమ ద్రిప్పలేక**
**మురికిభాండమందు ముసరు నీగల భంగి**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

మురికి కుండలోని తిండికోసం ఈగలు ముసురుకొన్నట్లు ఆయుస్సు ఉన్నన్ని దినాలు మనిషి ఆశతో తిరుగుతూ ఉంటాడు. భ్రాంతిని వదల లేడు.

**19.** **ఆశలుడుగ కున్న పాశముక్తుడు గాడు**
**ముక్తుడైనగాని మునియుగాడు**
**మునియునైతె గాని మోగంబులుడుగవు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఆశ లుడిగితే బంధాలు తొలగిపోతాయి. బంధాలు తొలగితే ముని అవుతాడు. ముని అయిన వానికి మోహం తొలగిపోతుంది.

**20.** **ఇంటిలోని ధనము నిది నాది యనుచును**
**మంటిలోన దాచు మంకుజీవి**
**కొండబోదు వెంట గుల్లకా సైనను**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

తాను సంపాదించిన ఇంటిలోని ధనాన్ని తనదని అనుకొంటూ భూమిలో దాచిపెడతాడు. తాను చనిపోతూ తనవెంట చిల్లిగవ్వ కూడా రాదని తెలియలేడు.

**21.** **ఇంద్రియములు బట్టి ఈడ్చుచు నుండగా**
**వెఱ్ఱి మనుజుడేల వెదకు శివుని**
**ఇంద్రియముల రోసి ఈశుని జూడరా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఇంద్రియాలు లాగుతూ ఉంటే వెర్రిమనిషి శివుని కోసం వెతకడం వీలుకాదు. ఇంద్రియాలను అదుపులో ఉంచుకొని శివుణ్ణి చూడాలి.

**22.** **ఇచ్చువాని వద్ద ఈని వాడుండిన**
**చచ్చుగాని ఈవి సాగనీడు**
**కల్పతరువు కింద గచ్చ చెట్టున్నట్లు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

దాతవద్ద లోభివుంటే చావనైనా చస్తాడు గాని దానం సాగనీయడు. గచ్చపొద వున్న కల్పవృక్షం నీడకు ఎవరూ చేరుకోజాలరు.

**23.** **ఇరుకు వచ్చు వేళ ఈశ్వరు నెంతురు**
**కరుణ గనునె వట్టి గాసి గాక**
**సుఖము వచ్చువేళ చూడంగ నొల్లరు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

కష్టం వచ్చినపుడు శివుని తలచి, సుఖపడేటప్పుడు దైవాన్ని తలచకుండా ఉంటే ఈశ్వరుడు కరుణించడు. సుఖ దుఃఖాలకు అతీతంగా మనస్సును నిలపాలి.

**24.** **ఇల్లు నాలి విడచి ఇనుపకచ్చలు గట్టి**
**వంటకంబు నీటి వాంఛ లుడిగి**
**ఒంటినున్న యంత ఒదవునా తత్వంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఇల్లు విడిచి, భార్యను వదలి, కామానికి గొళ్లెం వేసి, తిండి నీళ్లూ మాని ఒంటరిగా ఉన్నంత మాత్రాన తత్వం అలవడదు.

**25.** **ఉత్తముని కడుపున నోగు జన్మించిన**
**వాడు చెరచు వాని వంశమెల్ల**
**చెరకు వెన్ను బుట్టి చెరపదా తీపెల్ల**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చెరకుకు తుద వెన్నుపుట్టి చెరకులోని తీపిని నాశనం చేసినట్లు మంచివానికి మూర్ఖుడు పుట్టి వాని వంశాన్నే చెరుస్తాడు.

**26.** **ఉన్నతావు వదలి ఊరూరు దిరిగిన**
**కన్నదేమి నరుడు గ్రాసమునకు**
**తన్నులోను జూడ తమమెల్ల వీడును**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఉన్నచోటు విడిచి తీర్థయాత్రలు చేసినంత మాత్రాన ఉపయోగం లేదు. తనలో తాను చూచుకొన్నట్లయితే అజ్ఞానం తొలగిపోతుంది.

**27.** **ఉప్పుకప్పురంబు ఒక్క పోలిక నుండు**
**చూడచూడ రుచుల జాడవేరు**
**పురుషులందు పుణ్యపురుషులు వేరయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఉప్పూ కర్పూరం ఒక్కలాగే కనిపిస్తాయి. రుచులు వేరువేరుగా ఉంటాయి. మనుషులందరూ ఒకే విధంగా కనిపించినా, అందులో మంచి వారు వేరు.

**28.** **ఎంత చదువు చదివి ఎన్ని నేర్చినగాని**
**హీను డవగుణంబు మానలేడు**
**బొగ్గు పాలగడుగ పోవునా మలినంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పాలతో కడిగినంత మాత్రాన బొగ్గుకున్న నలుపు పోని విధంగా ఎంత చదివినా, ఎన్ని నేర్చినా హీనుడు తన నీచ గుణాలు మానడు.

**29.** **ఎద్దుకైన గాని యేడాది తెలిపిన**
**మాట తెలిసి నడచు మర్మమెరిగి**
**మొప్పె తెలియలేడు ముప్పదేండ్లకునైన**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఒక యేడాది నేర్పిస్తే ఎద్దైనా మనం చెప్పినట్లు తెలుసుకొని సేద్యానికి ఉపయోగపడుతుంది. ముప్పై యేండ్లు చెప్పినా మూర్ఖుడు తెలుసుకోలేడు.

**30.** **ఎన్ని తనువులైన మృతికి నడ్డము గావు**
**మృతిని గెలువలేని యెరుకలేల**
**దొంగరీతిగాక దొరకునా మోక్షంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఎన్ని శరీరాలైనా చావును తప్పించుకోలేవు. చావును గెలవలేని యెరుక వృథా! దొంగ యిల్లిల్లూ దూరి వస్తూ వున్నట్లు జీవుడు పుడుతూ గిడుతూ ఉంటాడు. మోక్షం మాత్రం దొరకదు.

**31.** **ఎరుక కన్నను సుఖ మేలోకమున లేదు**
**యెరుక నెరుగ నెవని కెరుక లేదు**
**యెరుక సాటి యెరుక యెరుకయే తత్వంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఎరుకకు మించిన సుఖం ఏ లోకంలోనూ లేదు. అయినా ఆ యెరుకను తెలుసుకోవాలనే ఆలోచన ఎవరికీ లేదు. ఎరుకకు సాటి యెరుక యెరుకయే. అదే తత్వం.

**32.** **ఎరుకమాలు జీవి యెంతకాలంబుండి**
**చచ్చి పుట్టుచుండు సహజముగను**
**ఎరుక మరచుచోటు నెరుగుట బ్రహ్మంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

బ్రహ్మం గూర్చి ఎరుక లేనివాడు అనేక జన్మలు చస్తూ పుడుతూ ఉంటాడు. ఎరుకను కూడా మరచిపోయే చోటు ఒకటుంది. అదియే బ్రహ్మం.

**33.** **ఏమి గొంచు వచ్చె ఏమి తాగొనిపోవు**
**పుట్టువేళ నరుడు గిట్టువేళ**
**ధనము లెచటి కేగు తానేగు నెచటికి**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

మనిషి పుట్టినపుడు ఏమీ తీసుకొని రాలేదు. తిరిగి గిట్టేటపుడు ఏమీ తీసుకొని పోలేదు. వాడు సంపాదించిన ధనం ఎక్కడికి పోతున్నదో, వాడెక్కడికి పోతున్నాడో తెలియకున్నాడు.

**34.** **ఒడల బూది బూసి జడలు ధరించిన**
**ఒడయడైన ముక్తి బడయ లేడు**
**తడక బిర్రుబెట్ట తలుపుతో సరియౌనె**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఒళ్ళంతా బూడిద పూసుకొని జడలు ధరించిన మాత్రాన ప్రభువుకైనా ముక్తిరాదు. ఇంటి జాగ్రత్త కోసం పుల్లల తడికె బిగించినంత మాత్రాన అది తలుపు కాదు. బాహ్య వేషాలవల్ల ముక్తిరాదు.

**35.** **ఒడ్డు పొడుగు గలిగి గడ్డంబు పొడుగైన**
**దాన గుణము లేక దాత యగునె**
**ఎనుము గొప్పదైన ఏనుగు బోలునా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఎత్తూ లావూ ఉండి, గడ్డం పొడుగ్గా ఉన్నంత మాత్రాన దాన గుణం లేకుండా దాత కాలేడు. వేషాన్ని బట్టి దాత గుణం నిర్ణయించలేము. ఎంత పెద్ద గేదె అయినా ఏనుగుతో సమానం కాదు. గేదె మూర్ఖమయినది, ఏనుగు తెలివి గలది.

**36.** **ఓర్పులేని భార్య యున్న ఫలంబేమి**
**బుద్ధిలేని బిడ్డ పుట్టి యేమి**
**సద్గుణంబు లేని చదువది యేలరా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఓర్పులేని భార్య వల్ల, బుద్ధిలేని బిడ్డ వల్ల ఫలం లేదు. మంచి గుణాన్ని, వివేకాన్ని ఇవ్వని చదువు కూడా వ్యర్థమే.

**37.** **కంకుభట్టనంగ కాషాయములు గట్టి**
**కొలిచె ధర్మరాజు కోరి విరటు**
**కాలకర్మగతులు కనిపెట్టవలెనయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

కంకుభట్టు పేరుతో, కాషాయం ధరించి తనకు తానుగా చక్రవర్తియైన ధర్మరాజు విరాటరాజు కొలువులో చేరాడు. కాలం కర్మం ఎలా నడుస్తూ ఉందో కనిపెట్ట గలగాలి.

**38.** **కనియు గానకుండు కదలింపడా నోరు**
**వినియు వినకయుండు విస్మయమున**
**సంపదగలవాని సన్నిపాతంబది**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చూచీ చూడనట్లు, వినీ విననట్లు, నోరు మెదపకుండా ధనవంతు డుంటాడు. అవి లోభితనమనే సన్నిపాత జ్వర లక్షణాలని తెలుసుకోలేడు.

**39.** **కన్నులందు మదము గప్పి కానరు గాని**
**నిరుడు ముందటేడు నిన్న మొన్న**
**దగ్ధులైన వారు తమకంటె తక్కువా?**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

గతంలో ఎంతో కాలంనుంచి ఈనేలమీద బూడిదైన వారు తమకంటె తక్కువవారు కాదు. కంటికి మదం గప్పడం వల్ల మృత్యువును సమీపిస్తున్నామని తెలుసుకొనలేకున్నారు.

**40.** **కర్మగుణములన్ని కడబెట్టి నడువక**
**తత్వమేల తనకు తగులు కొనును**
**నూనెలేని దివ్వె నువ్వుల మండునా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చెడు కర్మలను, చెడు ఆలోచనలను తొలగద్రోసి నడవాలి. అప్పుడే తత్వం అంటుకొంటుంది. దీపం నూనెతో మండుతుంది గాని, నువ్వులతో మండదు.

**41.** **కలిమినాడు నరుడు కానడు మదమున**
**లేమి నాడు పెట్ట లేదు మొదలె**
**కలిమి లేమి లేని కాలంబు కలుగునా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

సంపద ఉన్నప్పుడు కంటి కావరంతో దానం చేయాలని తెలుసుకోలేడు. ఆ సంపద లేనప్పుడు మొదలు పెట్టడానికే అసలు లేదు. కలిమి లేములు మానసిక రుగ్మతలని తెలియలేడు.

**42.** **కాశినీళ్లు మోసి కాళ్లు మొగము వాచి**
**ఎందు సుఖములేక ఎండి యెండి**
**చచ్చి వెనుక ముక్తి సాధింపగలరొకో**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

కాశిలోని గంగనీళ్లు రామేశ్వరానికి మోసి సముద్రంలో కలిపినంత మాత్రాన కాళ్లు మొగం వాయడం తప్ప ఇహంలోను పరంలోను సుఖం దక్కదు.

**43.** **కుండ కుంభ మండ్రు కొండ పర్వత మండ్రు**
**ఉప్పు లవణమండ్రు ఒకటిగాదె**
**భాషలింతె వేరు పరతత్వ మొక్కటే**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

కుండను కుంభమంటారు. కొండను పర్వతమంటారు. ఉప్పును లవణ మంటారు. భాషలు వేరైనప్పటికీ పరతత్వం ఒక్కటే.

**44.** **కుక్క గోవుగాదు కుందేలు పులిగాదు**
**దోమ గజము గాదు దొడ్డదైన**
**లోభి దాతగాదు లోకంబు లోపల**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఎంత గొప్పదైనను కుక్క సాత్వికమైన గోవు కాలేదు. భయపడి పరుగెత్తే కుందేలు పులికాలేదు. తొండంగల దోమ ఏనుగు కాలేదు. అలాగే పిసినిగొట్టు దాత కాలేడు.

45. కుక్క యేమెరుంగు గురులింగ జంగంబు
పిక్కబట్టి యొడిసి పీకుగాక
సంతపాక తొొత్తు సన్యాసి నెరుగునా
విశ్వదాభిరామ వినుర వేమ.

పిక్క బట్టి పీకడం మాత్రమే తెలిసిన కుక్క, జంగమ గురువునుకూడ వదలదు. అలాగే సంతలో దారిగాచి సంపాదించే వేశ్య సన్యాసివద్ద కూడా డబ్బులు గుంజడం మానదు.

46. కులము గలుగు వారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీగు వారు
పసిడి గల్గు వాని బానిస కొడుకులు
విశ్వదాభిరామ వినుర వేమ.

కులం, గోత్రం, విద్య ఉండి ఎంత గర్వించేవారయినా డబ్బున్న వారికి దాసులే సుమా!

47. కులములోన నొకడు గుణవంతు డుండెనా
కులము వెలయు వాని గుణము వలన
వెలయు వనములోన మలయజంబున్నట్లు
విశ్వదాభిరామ వినుర వేమ.

గంధపు చెట్టువల్ల అది ఉన్న వనం ప్రకాశించినట్లు ఒక్క గుణవంతుడి వల్ల అతని కులం ప్రకాశిస్తుంది.

48. కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు
సానుజాతమయ్యె సకల కులము
హెచ్చు తగ్గు మాట లెట్లెరుంగగవచ్చు
విశ్వదాభిరామ వినుర వేమ.

ఏ కులమైనా గొప్పదనీ తగ్గుదనీ గొడవలు అనవసరం. ఒకే కూటమి నుంచి ఒకదాని తరువాత మరొకటిగా కులాలు ఏర్పడ్డాయి. అందువల్ల కులాల హెచ్చుతగ్గులు తెలుసుకోవడం వీలుకాదు.

**49.** **కూడు బెట్టకున్న కుక్షిలో జఠరాగ్ని**
**భక్షణంబు సేయు కుక్షి మలము**
**కూడు విడిచి మలము గుడుచురా ఉపవాసి**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పొట్టలోకి కూడు వేయకపోతే, అందులోని జఠరాగ్ని కడుపులోని మలాన్ని తింటుంది. ఉపవాసం ఉన్నవాడు కూడు వదలి మలం తినడం అవుతుందేగాని తత్వం అలవడదు.

**50.** **కొంపలోన నున్న కోర్కెలు ఛేదించి**
**హృదయ మట్టె మిగుల పదిల పరచి**
**గృహము నిల్పువాడు బహుతత్వవేదిరా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

మనస్సును జాగృతం చేసి శరీరంతో అనుభవించే కోర్కెలను అధిగమించాలి. మానసిక నియంత్రణ ద్వారా శరీరాన్ని కాపాడుకొని దైనందిన కార్యాలు చేస్తూ సంసార జీవితాన్ని సాగించేవాడు అన్ని తత్వాలను తెలిసికొన్న వాడవుతాడు.

**51.** **కోతిబట్టి తెచ్చి కొత్తపుట్టము గట్టి**
**కొండముచ్చు లెల్ల కొలిచినట్లు**
**నీతిహీను నొద్ద నిర్భాగ్యులుందురు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

కోతికి కొత్త గుడ్డకట్టి కొండముచ్చులు పూజచేసినట్లు, నీతిలేనివాని చుట్టూ నిర్భాగ్యులు గుమికూడి గౌరవిస్తారు.

**52.** **కోపమునను ఘనత కొంచెమై పోవును**
**కోపమునను మిగుల గోడు గలుగు**
**కోప మడచె నేని కోరిక లీడేరు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

కోపంవల్ల గొప్పదనం తగ్గిపోతుంది. కోపం వల్ల దుఃఖం కలుగుతుంది. ఆ కోపాన్ని తగ్గించినపుడు మాత్రమే కోరికలు తీరతాయి.

**53.** **గంగ పారుచుండు కదలని గతితోడ**
**మురికి కాల్వ పారు మోత తోడ**
**అధికు డోర్చునట్లు అధము డోర్వగలేడు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

గంగ ప్రశాంతంగా ప్రవహిస్తుంది. మురికి కాలువ రొదచేస్తూ ప్రవహిస్తుంది. గొప్పవాడు ఓర్చుకోగలడు. నీచునికి ఓర్పుండదు.

**54.** **గంగిగోవుపాలు గంటెడైనను చాలు**
**కడివె డైన నేమి ఖరము పాలు**
**భక్తి గలుగు కూడు పట్టె డైనను చాలు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పవిత్రమైన గోవుపాలు గంటెడు చాలు. గాడిదపాలు కడివెడైనా వృథా! భక్తితో పెట్టిన అన్నం పట్టెడు చాలు.

**55.** **గూబ చేర గురము గునిసిపాడుగ బెట్టి**
**వెళ్లిపోదు రెంత వెర్రివారొ**
**గూబ గురము లేమి కూర్చురా కర్మంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

శకున పక్షి (గూబ) ఇంటిమీద వాలితే వెర్రివాళ్లు ఆ యింటిని కూల్చి వెళ్లి పోతుంటారు. గృహము లేకుండాపోయే కర్మకు గూబను నిందించడ మెందుకు?

**56.** **గొడ్డుటావు బిదుక కుండ గొంపోయిన**
**పళ్ల నూడ దన్ను పాల నీదు**
**లోభివాని నడుగ లాభంబు లేదయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పాలుపిండాలని కుండతీసుకొనివెళ్తే పాలివ్వదు సరికదా గొడ్డావు పండ్లూడ తన్నుతుంది. పిసినారిని అడిగితే ఫలితం అలాగే ఉంటుంది.

**57.** **చంపదగిన యట్టి శత్రువు తనచేత**
**చిక్కెనేని కీడు చేయరాదు**
**పొసగ మేలు చేసి పొమ్మనుటే చావు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చంపదగిన శత్రువు మనకు దొరికినా వాణ్ణిచంపకూడదు. వాడికి మంచిచేసి విడిచిపెడితే చాలు. అదే వాడికి చావుతో సమానం.

**58.** **చంపదలచు రాజు చనవగ్గలంబిచ్చు**
**చెఱుప నున్న పగర చెలిమిసేయు**
**కరవ నున్న పాము నెరిగాచుకొని యుండు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

రాజు చంపదలచిన వారితో చనువధికం చేస్తాడు. అలాగే చెఱుపదలచుకొన్న శత్రువులతో చెలిమి చేస్తాడు. కాటు వేయాలనుకొన్న పాము కాచుకొని ఉంటుంది కదా!

**59.** **చదివి చదివి చదివి చావంగ నేలను**
**చావులేని చదువు చదువ వలయు**
**చదువు మర్మమెరిగి చదివిన చదువురా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చదివి చదివి చదివి చావడమెందుకు. చావులేని చదువు చదవండి, చదువులోని మర్మం అంటే, మరణాన్ని అధిగమించడానికి చదివే చదువే – చదువు క్రింద లెక్క.

**60.** **చిక్కియున్న వేళ సింహంబునైనను**
**బక్క కుక్క కఱచి బాధపెట్టు**
**బలిమిలేని వేళ పంతంబు చెల్లదు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చిక్కి ఉన్నప్పుడు సింహాన్నైనా బక్క కుక్క కరిచి బాధిస్తుంది. బలం లేని సమయంలో పంతాలకు పోరాదు.

**61.** **చిత్తశుద్ధి గల్గి చేసిన పుణ్యంబు**
**కొంచెమైన నదియు కొదువ గాదు**
**విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత?**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

మఱ్ఱి విత్తనం చిన్నదైనా అది మహావృక్షమైనట్లు శుద్ధమైన మనస్సుతో చేసిన ఉపకారం కొంచెమైనా అది తక్కువేమీ కాదు.

**62.** **చినుగు బట్టగాదు చీనాంబరము గాని**
**మురికి యొడలు గాదు ముక్తిగాని**
**పరమయోగి మహిమ పరికింప నరుడురా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పరమ యోగుల మహిమను తెలుసుకోలేము. పరమయోగి చినుగు బట్టను చీనాంబరంగా భావిస్తాడు. మురికి బట్టిన ఈ శరీరాన్ని ముక్తి సాధనంగా భావిస్తాడు. బాహ్య విషయాలు, వేషాలు యోగికి అవసరం లేదు.

**63.** **చిప్పలోన బడ్డ చినుకు ముత్యంబయ్యె**
**నీటబడ్డ చినుకు నీళ్ల గలిసె**
**ప్రాప్తమున్న చోట ఫలమేల తప్పురా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చిప్పలో పడిన చినుకు ముత్యమవుతుంది. నీళ్లలో పడిన చినుకు నీటిలో కలిసి పోతుంది. ప్రాప్తం ఉంటే ఫలితం తప్పిపోదు.

**64.** **చెట్టుచేమగొట్టి చుట్టు గోడలుబెట్టి**
**ఇట్టునట్టు పెద్ద యిల్లు గట్టి**
**మిట్టి పడును నరుడు మీది చేటెరుగక**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చెట్టూ, చేమా కొట్టి, గోడలు నిర్మించి పెద్ద యిల్లు కట్టి యిది తన యిల్లని మనిషి మిడిసి పడతాడు. ఆ యింట్లో తానెంత కాలం ఉంటాడో తెలుసుకోలేడు.

**65.** **చెమట కారునట్లు శ్రమపెట్టి దేహంబు**
**గడనచేసి కూడు కుడువవలయు**
**తల్లిదండ్రి సొమ్ము తాదింట కారాదు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ శరీరాన్ని శ్రమపెట్టి సంపాదించిన సొమ్ముతో జీవించాలి. తల్లిదండ్రులు కూడబెట్టిన సొమ్ము ఖర్చుచేసి జీవించడం తప్పు. శ్రమను పవిత్రంగా భావించాలి.

**66.** **చేటు వచ్చెనేని చెడనాడు దైవంబు**
**మేలు వచ్చెనేని మెచ్చు తన్ను**
**చేటు మేలు తలప చేసిన కర్మముల్**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చెడు గలిగితే దైవాన్ని దూషిస్తారు. మేలు కలిగితే తనను తాను మెచ్చుకొంటాడు. ఆ చెడు మేళ్లు మునుపు చేసిన పాపపుణ్యాల ఫలితాలే.

**67.** **జీవి జీవి జంపి జీవికి వేయగా**
**జీవి వలన నేమి చిక్కియుండె**
**జీవిహింసలకును చిక్కునా మోక్షంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

జీవిని చంపి తినటం కోసం, జీవిని చంపి దైవానికి నైవేద్యం పెడతారు. ఆ జీవిని చంపడంవల్ల ఏ ముక్తి లభించదు. జీవిని హింసిస్తే మోక్షం రాదు.

**68.** **తనువు ఎవరి సొమ్ము తనదని పోషింప?**
**ధనము ఎవరి సొమ్ము దాచుకొనగ?**
**ప్రాణ మెవరి సొమ్ము పాయకుండగ నిల్ప?**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ శరీరం తనది కాదని తెలిసికూడా పోషించడమెందుకు? ధనం చంచలమయిందని తెలిసికూడా దాచుకోడమెందుకు? ప్రాణం పోకుండ నిలబెట్టుకొనుటకు అది తన సొత్తుకాదని తెలియాలి.

**69.** **తనువు లస్థిరమని ధనము లస్థిరమని**
**తెలుప గలడు తాను తెలియ లేడు**
**చెప్పవచ్చు పనులు చేయుట కష్టమౌ**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ దేహం శాశ్వతం కాదని, ఈ ధనం అశాశ్వతమని ఇతరులకు చెబుతాడు. కాని, తాను తెలుసుకోలేడు. చెప్పడం సులువే, చేయడమే కష్టం.

**70.** **తపము జపములేల ధాత్రిజనులకెల్ల**
**ఒనర శివుని జూడ ఉపమగలదు**
**మనసు జెదరనీక మదిలోన జూడరో**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

జపాలు తపాలు అవసరం లేదు. శివుణ్ణి చూచేందుకు ఉపాయం ఉంది. మనస్సును చెదరకుండా నిలిపి మనస్సులో చూపు నిలబెడితే చాలు.

**71.** **తప్పులెన్ను వారు తండోపతండంబు**
**ఉర్విజనుల కెల్ల నుండు తప్పు**
**తప్పు లెన్ను వారు తమతప్పు లెరుగరు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

తప్పులు వెదికే వారు దండిగా ఉన్నారు. ఈ నేలమీద ఉండే వారందరిలో తప్పులున్నాయి. కాని తప్పులు వెదికే వాళ్లు తమ తప్పులు తెలుసుకోలేకుండా ఉన్నారు. ఆలోచన అంతర్ముఖంగా ఉండాలి.

**72.** **తల్లిదండ్రిమీద దయలేని పుత్రుండు**
**పుట్టనేమి వాడు గిట్టనేమి**
**పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పుట్టలో చెదలు పుడుతుంది, చస్తుంది. అదే విధంగా కనిపెంచిన తల్లిదండ్రులమీద కనికరంలేని కొడుకు పుట్టి లాభం లేదు, చచ్చి నష్టం లేదు.

73. తాము కన్నవారు, తము గన్నవారును
చచ్చుటెల్ల తమకు సాక్షిగాదె
బ్రతుకు టెల్ల తమకు బ్రహ్మకల్పంబులా
విశ్వదాభిరామ వినుర వేమ.

తనను పుట్టించిన వాళ్లూ, తాను పుట్టించిన వాళ్లూ చస్తూ ఉండడం చూస్తూ ఉన్నారు. మనుషులు కలకాలం జీవించగలమనే భ్రమను వదల కున్నారు.

74. తీర్పనార్పలేని తీర్పరి తనమేల
కూర్పవిప్పలేని నేర్పరేల?
పెట్టిపోయలేని వట్టిబీరము లేల?
విశ్వదాభిరామ వినుర వేమ.

తీర్చలేనివాడు, ఆర్చలేనివాడు తీర్పరిగా ఉండకూడదు. కూర్చలేని వాడు, విప్పలేనివాడు నేర్పరి కాడు. దప్పిక తీర్చి కడుపు నింపని బీరాలు పనికిరావు.

75. దేవపూజలందు దేవాలయములందు
దేవుడుంట జెప్పి తెరువుజూపి
తెలియ విశ్వమెల్ల దేవాదిదేవుడే
విశ్వదాభిరామ వినుర వేమ.

పూజలు జరిగే చోట, దేవాలయాల్లో దేవుడున్నాడని చెబుతారు. విశ్వమంతటా ఆ దేవదేవుడు లేని చోటు లేదని తెలియరు.

76. ధనము కూడబెట్టి ధర్మంబు చేయక
తాను దినక లెస్సదాచు గాక
తేనె నీగ కూర్చి తెరువరి కియ్యదా
విశ్వదాభిరామ వినుర వేమ.

తేనెటీగ దాచిన తేనెను దారిన పోయేవాడు తన్నుకు పోయినట్లు, కూడ బెట్టిన ధనాన్ని ధర్మం చెయ్యాలి, తినాలి. లేదా ఆ ధనాన్ని ఎవడో ఒకడు దోచుకుంటాడు.

**77.** **నిన్నుజూచెనేని తన్ను తామరచును**
**తన్ను జూచెనేని నిన్నుమరచు**
**ఏవిధమున జనుడు నెరుగు నిన్నును దన్ను**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ పద్యంలో నిన్ను - భగవంతుడు, తాను - జీవుడు.

భగవంతుని జూచిన జీవుడు తనను తానే మరచిపోతాడు. తనని (శరీరాన్ని) చూచుకుంటే భగవంతుని మరుస్తాడు. దేవుణ్ణీ, తనను ఒకేమారు ఏవిధంగానైనను తెలుసుకోలేకున్నాడు.

**78.** **నీళ్లలోన మొసలి నిగిడి యేనుగు బట్టు**
**బయట కుక్క చేత భంగపడును**
**స్థానబలిమి కాని తన బల్మి కాదయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

మొసలి నీళ్లలో ఉన్నప్పుడు, ఏనుగునైనా పట్టుకొంటుంది. బయటకు వస్తే కుక్క చేతకూడా భంగపాటు చెందుతుంది. అది స్థానబలం అవుతుంది కాని, తన బలం కాదు.

**79.** **నీళ్లలోని చేప నెరిమాంసమాశకు**
**గాలమందు జిక్కి కూలినట్లు**
**ఆశబుట్టి మనుజుడారీతి జెడిపోవు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చేప ఆహారం మీది ఆశతో గాలంలో చిక్కి మరణిస్తుంది. మనిషి ఆశ పెంచుకొంటూ చేపవలె చెడిపోతాడు.

**80.** **నేరనన్న వాడు నెరజాణ మహిలోన**
**నేర్తు నన్నవాడు వార్త కాడు**
**ఊరకున్న వాడె ఉత్తమోత్తముడయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

నాకు తెలియదన్నవాడు నెరజాణ. తెలిసికూడా తెలియదని ఇతరుల జోలి పట్టించుకోకుండా తన పని తాను చూచుకుంటాడు. తెలుసుననేవాడు

వార్తకాడు. తనకు కొంచెం తెలిసినా ఎంతో తెలుసునని ప్రకటిస్తూ మిడిమిడి జ్ఞానంతో తానొక వ్యవహారజ్ఞానం ఉన్నవాడుగా నటిస్తాడు. ఇక ఊరకున్న వాడు ఉత్తమయోగి. తెలుసుననడు, తెలియదనడు. తాను వచ్చిన పనేమిటో అది చూచుకుంటూ పోతాడు. లోక వ్యవహారాలకు లోనుకాకుండా తామరాకు మీద నీటిబొట్టువలె ఉంటాడు.

**81.** **నొసలు బత్తుడయ్యె నోరు తోడేలయ్యె**
**మనసు భూతమట్లు మలయగాను**
**శివుని గొల్తు ననగ సిగ్గెట్టు రాదురా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

నోరు తోడేలు లాగా, మనస్సును భూతంలాగా ఉంచుకొని నుదుట విబూది ధరించి శివుణ్ణి కొలుస్తున్నానని అనడానికి సిగ్గులేదా?

**82.** **పందిపిల్ల లీను పదియు నైదింటిని**
**కుంజరంబు ఈను కొదమ నొకటి**
**ఉత్తముడగు పురుషు డొక్కడు చాలడా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పంది ఎన్నో పిల్లల్ని కంటుంది. ఏనుగు ఒక్క బిడ్డకే జన్మనిస్తుంది. పంది పిల్లలు పది కంటే ఏనుగుపిల్ల ఒక్కటి చాలు కదా!

**83.** **పట్టు పట్టరాదు పట్టి విడువరాదు**
**పట్టెనేని బిగియ పట్ట వలయు**
**పట్టి విడుట కన్న పడిచచ్చుటే మేలు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పట్టు పట్ట కూడదు. పట్టిన తరువాత విడువకూడదు. గట్టి పట్టే పట్టాలి. పట్టి విడిచి పెట్టడం కంటే చావడం మేలు.

**84. పదుగురాడు మాట పాటియై ధర జెల్లు**
**ఒక్కడాడు మాట ఎక్క దెందు**
**ఊరకుండు వాని నూరెల్ల నోపదు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పదిమంది మాట చెల్లుబడి అవుతుంది. ఒక్కడు నిజం పలికితే చెల్లుబాటు కాదు. ఊరకుండే వాడిని ఊరంతా కలిసికూడా ఏమీ చేయలేదు.

**85. పసుల వన్నె వేరు పా లేకవర్ణమౌ**
**పుష్ప జాతి వేరు పూజ యొకటి**
**దర్శనములు వేరు దైవంబు ఒక్కటి**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పశువులు ఏ రంగులో ఉన్నా పాలు ఒకే రంగులో ఉంటాయి. పూలు ఎన్ని రకాలైనా పూజ ఒకే విధంగా ఉంటుంది. దర్శన గ్రంథాలు ఎన్నైనా అవి చూపించే దైవం ఒక్కడే.

**86. పాలసాగరమున పవ్వళించిన వాడు**
**గొల్లయిండ్ల పాలు కోర నేల**
**ఎదుటి వారి సొమ్ము లెల్లవారికి తీపి**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

శ్రీ మహావిష్ణువు పాల సంద్రంలో పడుకొని ఉంటాడు; ఆయన గొల్లవారి యిండ్లలో పాలు, వెన్నలు దొంగిలించడం దేనికి? ఎదుటివారి సొమ్ములు అందరికీ తీపి కదా!

**87. పిండములను జేసి పితరుల దలపోసి**
**కాకులకును బెట్టు గాడ్దెలార**
**పియ్యి దినెడు కాకి పితరు డెట్లాయెరా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చచ్చిన తలిదండ్రుల్ని తలచుకొంటూ కాకులకు పిండాలు పెడుతూ ఉంటారు. మలం తినే కాకి తల్లిగాని తండ్రిగాని అవుతుందా?

88. పుత్తడి గల వాని పుండు బాధయు గూడ
వసుధలోన చాల వార్త కెక్కు
పేదవాని యింట పెండ్లైన నెరుగరు
విశ్వదాభిరామ వినుర వేమ.

ధనవంతుని పుండు ప్రపంచానికి వార్త అవుతుంది. పేదవాని యింట్లో పెండ్లి జరుగుతున్నా ఎవరూ పట్టించుకోరు. ప్రచారానికి ధనమే మూలం.

89. పెక్కు జనుల గొట్టి పేదల వధియించి
డొక్కకొరకు నూళ్లు దొంగిలించి
ఎక్కడికిని బోవ ఎరిగి యముడు జంపు
విశ్వదాభిరామ వినుర వేమ.

ఎంతో మంది పేదల్ని కొట్టి చంపి, ఊళ్లు దోచుకొని, ఈ పొట్టకోసం సంపాదించి ఎక్కడ దాక్కున్నా, యముడు తెలుసుకొని చంపుతాడు.

90. పేరు సోమయాజి పెనుసింహ బలుడాయె
మేకపోతుబట్టి మెడను విరువ
కాని క్రతువు వలన కలుగునా మోక్షంబు
విశ్వదాభిరామ వినుర వేమ.

యజ్ఞాలు చేసే వాడు సోమయాజి. యజ్ఞంలో మేక మెడను విరిచి చంపుతాడు. ఇలాంటి జీవహింసచేసే క్రతువు వల్ల మోక్షం కలుగుతుందా!

91. బ్రతుకులన్ని మాయ భవబంధములు మాయ
తెలివి మాయ తన్ను తెలియ మాయ
మాయ దెలియు వాడె మర్మజ్ఞుడగు యోగి
విశ్వదాభిరామ వినుర వేమ.

బ్రతుకు మాయ. చావు పుట్టుకలు మాయ. తెలివి మాయ. తన్ను తాను తెలుసుకున్న మాయ యేమిటో విశదమవుతుంది. మాయను తెలుసుకొన్నవాడె మర్మం తెలిసిన యోగి.

**92.** **బ్రహ్మ మనగ వేరె పరదేశమున లేదు**
**బ్రహ్మ మనగ తానె బట్ట బయలు**
**తన్ను తానెరిగిన తానె పో బ్రహ్మంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

బ్రహ్మ పదార్థం మరెక్కడో లేదు. తానే బ్రహ్మమని బట్టబయలుగా తెలుసుకోవాలి. తన్ను తాను తెలుసుకొన్నవాడే బ్రహ్మం.

**93.** **బ్రహ్మ మేడయనుచు పలుమారునాడేరు**
**వెర్రి మూర్ఖజనుల విధముజూడ**
**బ్రహ్మ మన్నిటందు పరిపూర్ణమై యుండు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

బ్రహ్మం ఎక్కడని ప్రశ్నించడం మూర్ఖుల తీరు. బ్రహ్మం అంతటా నిండుకొని ఉన్న విరాట్ స్వరూపుడని తెలియ లేరు.

**94.** **భూమిలోన బుట్టు భూసార మెల్లను**
**తనువులోన బుట్టు తత్వమెల్ల**
**శ్రమములోన బుట్టు సర్వంబు తానౌను**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

భూమిలో భూసారం పుట్టినట్లే, తనువులో తత్వం పుడుతుంది. అలాగే శ్రమము యొక్క ఫలితమంతా బ్రహ్మమనే తెలియాలి.

**95.** **మంటికుండవంటి మాయ సంసారంబు**
**చచ్చు నెన్నడైన జావదాత్మ**
**ఘటములెన్నియైన గగనంబె ఏకమే**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ సంసారం మట్టికుండ వంటిది. ఈ సంసారంలో భ్రమించే శరీరం చస్తుందిగాని ఆత్మచావదు. కుండలు వేరైనా అందులోని ఆకాశం ఒక్కటే.

96. మనసులోని ముక్తి మరియొక చోటను
వెదుక బోవువాడు వెర్రివాడు
గొర్రె చంకబెట్టి గొల్ల వెదకినట్లు
విశ్వదాభిరామ వినుర వేమ.

గొర్రెపిల్లను చంకలో పెట్టుకొని గొల్లవాడు వెతికినట్లు మోక్షం కోసం వెర్రివాని వలె మనసుకు ఆవల వెదకుతున్నాడు.

97. మనసులోనె పుట్టె మాయసంసారము
మనసు విరిగెనేని మాయ తొలగు
మనసు నిల్పెనేని మహి తానె బ్రహ్మము
విశ్వదాభిరామ వినుర వేమ.

మనసునుంచే సంసారపు మాయ పుడుతుంది. మనసు విరిగిపోతే మాయ తొలగి పోతుంది. మనసు నిశ్చలముగా పెట్టుకొన్న వాడే బ్రహ్మం.

98. మర్మమెరుగ లేక మతముల గల్పించి
ఉర్వి దుఃఖులగుదు రొకరికొకరు
గాజు యింట కుక్క కళవళపడురీతి
విశ్వదాభిరామ వినుర వేమ.

గాజు గదిలో దూరిన కుక్క బయటపడే మార్గం తెలియనట్లు దైవ రహస్యం తెలియక మతాలు కల్పించుకొని ఒకరికొకరు దుఃఖాలనుభవిస్తూ ఉన్నారు.

99. మాట లుడుగకున్న మంత్రంబు దొరకదు
మంత్ర ముడుగ కున్న మది కుదురదు
మనసు నిల్పకున్న మరి ముక్తిలేదయా
విశ్వదాభిరామ వినుర వేమ.

మౌనంగా ఉంటే మంత్రం దొరుకుతుంది. ఆ మంత్రం ఉడిగితే మనసు కుదురుతుంది. మనసు కుదురుకోడమే ముక్తి.

**100.** **ముక్కుతాళ్ల గ్రుచ్చి మురికి పోవగదోమి**
**కచ్చనీరు నించి కడిగి కడిగి**
**డొక్క దొలచినంత దొరకునా మోక్షంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ముక్కులో తాడు దూర్చి, కడుపునిండా నీరుపోసి ఒళ్లు శుద్ధి చేసుకొంటారు. అందువల్ల శరీరం శుద్ధి అవుతుంది గాని మోక్షం సిద్ధించదు.

**101.** **మేడిపండు చూడ మేలిమై యుండును**
**పొట్టవిప్పి చూడ పురుగు లుండు**
**పిరికి వాని మదిని బింకమీ లాగురా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

మేడిపండు బంగారంలాగా నిగనిగ లాడుతుంది. దాని కడుపులో పురుగులుంటాయి. పిరికివాని మానసిక బింకము మేడిపండులాగా బయటికి అందంగా ఉంటుంది.

**102.** **మొండివానికేల ముంజేతి కడియాలు**
**తొట్టివానికేల కర్రపండ్లు**
**గాడిదలకు నేల గడ్డముల్ మీసముల్**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పిసినిగొట్టు ముంజేతికి కడియాలు, మాట దప్పే వానికి కర్రపండ్లు, విద్యలేని వెర్రులకు గడ్డాలు, మీసాలు అవసరం లేదు.

**103.** **మొదట నాసబెట్టి తుదలేదు పొమ్మన**
**పరమలోభులైన పాపులకును**
**వారియుసురు దాకి వగచెడి పోవరా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఆశ పెట్టకూడదు. ఆ తరువాత లేదు పొమ్మన కూడదు. అటువంటి పాపులు వాళ్ల ఉసురు తాకి చెడిపోతారు.

**104.** **రాతిబొమ్మ కేల రంగైన వలువలు**
**గుళ్ల గోపురములు కుంభములును**
**కూడుగుడ్డ తాను గోరునా దైవంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

రాతి బొమ్మలకు వస్త్రాలు, గుడులు గోపురాలు నైవేద్యాలు అవసరం లేదు. కూడు, గుడ్డ దేవుడు కోరుకోడు. అవన్నీ మనం కల్పించినవే.

**105.** **లోభివాని జంప లోకంబు లోపల**
**మందు వలదు వేరు మతము గలదు**
**పైక మడిగినంత భగ్గున పడిచచ్చు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ లోకంలో పిసినారిని చంపడానికి మందు అవసరం లేదు. డబ్బు కావాలి అని అడిగితే సరి – అట్టే చచ్చిపోతాడు.

**106.** **విడువ ముడువలేక కుడువగట్టగ లేక**
**వెరవు లేక విద్య నొరయలేక**
**వెడలలేనివాని నడపీను గందురు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఖర్చు చేయలేడు, దాచలేడు, తినలేడు, అనుభవించ లేడు. తెలివిగా చదువు గ్రహించ లేడు. అట్టివాణ్ణి లోకం నడిచే పీనుగని అంటుంది.

**107.** **విద్యలేని వాడు విద్వాంసుల కడను**
**ఉండగానె పండితుండు గాడు**
**కొలని హంసలకడ కొక్కెర యున్నట్లు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

పండితుల దగ్గర ఉన్నంత మాత్రాన చదువులేని వాడు పండితుడు కాడు. హంసలతో కొంగ కలిసినంత మాత్రాన దానికి గుర్తింపురాదు.

**108.** **వెన్న చేత బట్టి వివరంబు దెలియక**
**ఘృతము గోరునట్టి యతని భంగి**
**తాను దైవమయ్యు దైవంబు దలచును**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

వెన్న చేతిలో ఉంచుకొని నేయి కోసం వెతికినట్లు తానే దైవమని తెలిసి కూడా దైవాన్ని తలచుకుంటాడు.

**109.** **వేరుపురుగు చేరి వృక్షంబు చెరచును**
**చీడపురుగు జేరి చెట్టు చెరచు**
**కుత్సితుండు జేరి గుణవంతు జెరచురా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

వేరుపురుగు వృక్షాన్ని చెరుస్తుంది. చీడ చెట్టును చెరుస్తుంది. అలాగే గుణవంతుడు నీచుని సహచరంవల్ల చెడిపోతాడు.

**110.** **వ్యాధి కలిగెనేని వైద్యుని చేతను**
**మందు దినక కాని మాన దెందు**
**చెంత దీపమిడక చీకటి పాయునా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

రోగం వస్తే వైద్యుడిచ్చిన మందు పుచ్చుకొంటే రోగం పోతుంది. చీకటి ముసురుకొన్నప్పుడు దీపం వెలిగించకుండా చీకటి పోదు కదా!

**111.** **సకలతీర్థములను సకలయజ్ఞంబుల**
**తలలు గొరిగినంత ఫలము గలదె**
**తలలు బోడులైన తలపులు బోడులా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

తీర్థాలకు వెళ్లడం, యజ్ఞాలు చేయడం, తల గుండు గీయించు కోడం– ఇలాంటి వాటి వల్ల ప్రయోజనం లేదు. తలబోడి అయినంత మాత్రాన మనస్సులో ఉన్న తలపులు వెళ్లిపోవు.

**112. సుగుణవంతురాలు సుదతియై యుండిన**
**బుద్ధిమంతు లగుచు పుత్రు లొప్ప**
**స్వర్గ మేటి కయ్య సంసారి కింకను**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

భార్య సుగుణవంతురాలై, బిడ్డలు బుద్ధిమంతులై ఉంటే సంసారికి స్వర్గమవసరం లేదు.

**113. హీనగుణము వాని నిలుసేర నిచ్చిన**
**ఎంత వానికైన నిడుమ గలుగు**
**ఈగ కడుపు జొచ్చి యిట్టట్టు సేయదా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈగ కడుపులో దూరితే కళవళం కలుగుతుంది. అలాగే నీచుణ్ణి ఇంట్లో చేరదీస్తే ఇబ్బంది కలుగుతుంది.

**114. హృదయమందు నున్న ఈశుని దెలియక**
**శిలల కెల్ల మ్రొక్కు జీవులార!**
**శిలల నేమి యుండు జీవులందే కాక?**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

హృదయములోనున్న శివుణ్ణి దర్శించలేక, జీవులందుండే శివుణ్ణి తెలుసుకోలేరు; రాళ్లలో శివుడున్నాడని రాళ్లకు మొక్కే జీవులు నిజాన్ని కనలేరు.

**పద్యాలు వినండి**
www.reddyseva.org/downloads